వేంకటకవి, తురగా

నిర్వచనభగీరథోపాఖ్యానము

గుంటూరు, 1907

Record no. 349

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వేంకటకవి, తురగా.

నిర్వచనభగీరధోపాఖ్యానము / తురగా వేంకటకవిచే రచింపంబడినది.- గుంటూరు : భీమా రామదాసు, 1907.

71p. ;20 cm.

Record no. 349

Vēṅkaṭakavi, Turagā.

Nirvacanabhagīradhōpākhyānamu / Turagā Vēṅkaṭakavicē racimpambaḍinadi.- Guṇṭūru : Bhīmā Rāmadāsu, 1907.

71p. ;20 cm.

Record no. 349

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:

శ్రీ

# నిర్వచనభగీరథోపాఖ్యానము



ఇది

తురగా వేంకటకవిచే

రచింపంబడి



శ్రీమా రామదాసుగారిచే

గుంటూరులోనున్న

*వాణీముద్రాక్షరశాలయందు*

ముద్రింపించి ప్రచురింపంబడియె.

1907



శ్రీవాసుదేవాయనమః.

# నిర్వచన భగీరథోపాఖ్యానము.

శ్రీసౌందర్యపయోజలాకరవరోర్మిప్రోజ్వలంబత్రిదు । ర్వాసో
ముఖ్యమునీంద్రసేవితమమిత్రధ్వాంతనక్తాంతనం । భాసత్పూషమనార్య
దుర్లభము భీమారామదాసాత్మన । ద్వ్యాసంబైతగుచున్న కేశవ పరబ్ర
హ్మంబుమమ్మేలుతన్॥

సీ॥ భువనజాతములున్న బొజ్జవానివరించి భువనజాతములుగీము
లుగమించి । కమలాంకసహజమై గౌరవంబువహించి కమలాంకమైమెక
శాగరిమగాంచి । ప్రద్యుమ్నుడనుతనూభవుకూర్మిగనిపెంచి ప్రద్యుమ్న
గృహపాళి పదవినించి । జీవనాకరమందు చెన్నుమీరజనించి జీవనాకర
ములాశ్రితులకూంచి । ధాత్రిజెల్వారులేఖ కాంతామతల్లి । తల్లితల్లియ
శేషాత్మదాసకల్ప । వల్లిశ్రీరామదాసుసద్భవనసీమ । నుండుగాతసరిష్టా
ళిజెండుగాత॥

శా॥ సామేనంగల నన్నుజూడకయె శీర్షంబెక్కియున్నావటం ।
చామిన్నేటినిబల్కియవ్వలికి ద్రోయంగాళికాదేవియు । గ్రామర్షంబున
నర్ధచంద్రమిడి కేళ్ళాత్తించెనాగన్ శిర । స్వామిన్ ఖండవిధుండుగ్రాలదగు
మా శ్రీకంఠుసేవించెదన్॥

సీ॥ కమలోజ్వలంబైన కరతలస్థితిగాంచి ఘనసుషమావిభూతిని
వహించి । చిత్రకాగ్నిశిఖోల్లసితఫాలమునమించి ఖలనిశాచరపురంబు
లగలంచి । సరసగుణకదంబసంగతివర్తించి హాలికాండవైభవంబవధరిం
చి । రత్నాకరకలాప రమ్యంబునెసగించి యచలశృంగారాలయతవసిం
చి । సంతతంబుశివాభిఖ్య సంగ్రహించి । నిరుపమంబైన యభ్రివేణిని
భరించి । సుగనివడువున నెగడెడి నగతనూజ । భూరిసంపదలిడి మమ్ము
బ్రోచుగాత॥

ఉ॥ తొసిరిలోగిటంగలిగి దైవతకోటికి మేటియైవచః। కేసరిమధ్య కావ్యములు కేళిగృహంబులు జేసియధ్వర। గ్రాసులు మెచ్చనిక్కపుజగంబుసుఖంబుగనేలుచున్నభా। షాసఖుడాయురున్నతులొసంగుత మాకసిశంబుకూర్మిమిన్॥

మ॥ కవులశ్రాంతముగొల్వమించిభువనఖ్యాతిన్విడంబించియూ। ర్మివితానంబుధరించి కచ్ఛపిఘనశ్రీలన్ప్రవర్తించిభూ। ర్యవదాతప్రభలన్వహించివర శబ్దాభోగతల్ గాంచిన। చ్ఛవయాదివ్య సరస్వతీమణిరసశ్రేణుల్ ప్రసాదించుతన్॥

చ॥ కరదళితాభ్రధునవ్యరువి కాసరోజుడుభక్తకుంజరో। త్కరసురగహ్వరీజుడు జగన్నయనోజ్వల తేజుడున్నమ। త్సరదసకళాజితాజుడురసారధునగ్రతనూజుడున్ శ్రీపూ। మరుదపసారితాచల సమాజుడుమాజుడుమమ్ముబ్రోవుతన్॥

సీ॥ అమితరాగప్రశస్తాభిరామైక సుగ్రీవుడైయవిత సుగ్రీవుడయ్యె। ధీరకేసర్యంబు నారమణ్యాగ్రకుమారుడై సత్వకుమారుడయ్యె। పదనఖదళితశుంభత్సు వేలాహ్వాయాగారుడైన తహ్యాదాగారుడయ్యె। రామాస్యపూర్ణతా రారాట్చకోరాయి తాక్షుడైదోర్నిర్జితాక్షుడయ్యె। నెవ్వడాతండు మత్కృతాహీనకావ్య। హారఘటితామలినశబ్దవారమూర్తి। కుండువిజ్ఞానధుత సనకుండువాయు। పుత్రకుండు సిరులమమ్ముబ్రోచుగాత॥

చ॥ రవిశశిభూజసౌమ్య సురరాట్సచివాసుర దేశికార్కిరా। హువులునుగేతువుల్ బదునొకండగురాసినెసంగుసౌఖ్యమీ। నవకృతియత్నకారి కధునాతనసత్కవిరాజకల్పక। ద్రువునకు రామదాసునకు రూఢిగనిత్తురు గాతకూరిమిన్॥

గీ॥ మానితాద్వైతదంభ భర్మంబుదుర్మ। తాంధకారవిగోచరంబైనభాను। మూర్తియైలోచిదానినిమ్ముగవెలుంగ। గరపిచెలువొందు శంకర గురుభజింతు॥

గీ॥ వేదములకన్నిటికి భాష్యవిరచనంబు। జేసినిజకీర్తులాశలజే



ర్చికశ్రాలు। కాలమాధవయతిని నిక్కముగగొల్తు। నిరుపమంబుగనీకృతినెగడుకొరకు॥

శా॥ తానద్వైతసరోరుహాకరము మాద్యద్దాన వాంశోదితా। ర్యానీకచ్ఛల కాసరచ్ఛటలచే నత్యాకులంబైచనం। గానచ్ఛస్థితిధీమ్రపాకతక యోగశ్రీనెసంగించెల। క్ష్మీనారాయణుడమ్మహాయతివిభుంగీర్తింతు శ్రేయోర్థినై॥

క॥ కొలుతుసద్గురువిద్యా। లలితలహర్యాశ్రిమాలి లసితవివశ్చి। జ్జలరుహహేళిజ్ఞానక। పిలశౌరి పాటిబండ పిచ్చయసూరిన్॥

శా॥ ధీమంతుల్ స్మరణీకృతామితమహాదేవాభిధానుంగళా। శ్రీమంతున్వరమండపాటికులజుల్ శిష్యచ్ఛటాకల్పును। క్షేముంగూపతటాకసృష్టి పరమేష్టింజానకీరాముసం। ధామృత్యుంజయు మత్సఖుల్ దలతు శబ్దశ్రేణికాసిద్ధికిన్॥

మ॥ పరమానందసుధాసరిల్లహరికా పాణింధమాంచత్కవి। త్వారమాకల్పితమైధిలీశ్వర చరిత్రచ్ఛద్మసప్రచ్ఛదాం। తరనిర్యాతయశస్సితాభ్రసురజః సంతానశ్వేతీభవ। త్సరసీజాతభవాండునాకుభవునాత్మంగూర్మిసేవించెదన్॥

ఉ॥ మోములునాల్గులేని బిసపుష్పభవుండుద్విబాహుడౌరమా। ధాముడునేత్రయుగ్మ గిరిధన్వియనందగు బాదరాయణ। స్వామివసిష్ఠునప్తనల శక్తినుపౌత్రుబరాశరాత్మజ। గ్రామణిశ్రీశుకార్య గురుగాఢతపోనిధినాశ్రయించెదన్॥

మ॥ భవభూతింజయదేవు బిల్హణకవిన్బాణున్మయూరాభిధున్। శివభద్రాహ్వయు భట్టహర్షుగుణ రాశిన్ గాళిదాసాఖ్యభా। రవిమాఘున్సమదంతుమల్హణుని ధారానాధుదండిన్ బుధ। స్తవసుంధర్మసుధీమణిందలతు నాత్మంగావ్యసంసిద్ధికిన్॥

గీ॥ సౌరభాషనలరు భారతరామాయ। ణములుదెల్గొనర్చినుమహితమగు। కీర్తినటికిగొండ్లిగీములాశలుజేసి। నట్టికవులదలతు నధికభక్తి॥

చ॥ చదివినహాయనంబులు ప్రసంగవశంబున బల్కుటింత్రైబెం। పొదవినవిద్య దెల్పరు క్రియోన్నతిబారము లైనపద్యముల్ । వదురుదురర్థయుక్తముగ వాడిక లేనివి జెప్ప లేరహో। పెదవిమలంతు రార్యకృతిబృందముగ న్గొనినీచకాకవుల్॥

ఉ॥ డగ్గరియున్న నాడగగడంగరు జచ్చినయట్లు దవ్వనం । బగ్గలు జెప్పుచుందురల పట్టునధీరుడు దారసిల్లినన్ । సిగ్గున బారజూచెదరి సీయలనీచులనుచ్చరింపన। మ్యగ్గురుభక్తిశాలికిమహాకవివాళికిరోతగాదొకో॥

గీ॥ ఈకరణినిష్ట దేవతానీకములను । వరమతాచార్యులను కళాగురుని సఖుని । సంస్కృతకవిప్రభులనాంధ్రసత్కవులను । నుతులుగావించికుకవిధిక్కృతులు సలిపి॥

క॥ కృతినొక్కటి నిర్మింపన్ । మతిదలచియు నెల్లమంద మారారిపద । ద్వితయంబుగొల్చిక్రమ్మరి । కుతుపసమయమునను గంటిగుడిపూడితగన్॥

గీ॥ అవనిగుడిపూడి వెంకటప్పయ్యధీరు । డంగజాకారు డతులవిద్యావిచారు । డామహోదారునింటికే నరుగ బ్రేమ । నెరపిబంధుప్రియమునమన్నించినిల్పె॥

గీ॥ నిల్పిసరసాన్నమునతుష్టి నెరపినన్ను । గూర్చుకొని వెంకటప్పయ్యకోవిదుండు । ప్రేమభీమాన్వయుడగు శ్రీరామదాసు । నింటికే తేరగూర్మివహించియతడు॥

క॥ మమ్మున్నతాసనములహి । తమ్ముగగూర్చుండబెట్టి దాశరథిచరి । త్రమ్మాకర్ణించుచు । మోదమ్మారగనుండ కొంతదడవరిగినచోన్॥

మ॥ స్థిరకీర్తిన్ దురగాన్వయున్ సుగుణకంధిన్ దక్షిణామూర్తిన్స । త్కరుణాలబ్ధకవిత్వనిర్మితబహుగ్రంథోత్కరున్ సండితా । భరణుం వేంకటకవ్యధీశ్వరుమహా పల్యంకికోద్భాసితున్ । సరసున్ నన్గని పల్కె ధూర్జటిజటా సందీప్తగంగార్భటిన్॥

ఉ॥ భారతమందు పంచదశపర్వములం దెనుగించినట్టిధీ । సారుడు




దిక్కనాధ్వరి రసాస్థలి నెవ్వనిగోత్రసంభవుం । డైరహిఁ కెక్కె గౌతమమహామునిగోత్రపవిత్రుడెవ్వడా । ధీరుడు వేంకటప్పయ సుధీమణి మత్సఖుడౌ యెఱుంగవే॥

చ॥ నయనిధితీర్థయాత్రలు ఘనంబుగ నీగుడిపూడి వెంకటప్పయ జతబాయకేమును నిజాంగనతోనొనరించినాడని । శ్చయముగ నన్నియుం గలుషసంఘహరంబులె యైనగంగయా । రయనధికంబటంద్రు సుకరంబుగ వ్రాయుము తత్కథాస్థితుల్॥

ఉ॥ నాకులజాతవీరులిటు నాకుల చేరక యుండిరంచుము। న్నాకులుడై భగీరథుడ నాకులవృత్తి దపంబొనర్పమీ । నాకరతూణు దేపగిది నాకధునిం గొనె నెట్లు దానిదా । నాకకు దెచ్చి మానితగ నాకలిదీర్చుకొనెన్ వచింపుమీ॥

క॥ గుడిచెర్వు దోపుగొడుకున్ । గడిమి ద్విజస్థాపనంబు గనకము ధరయుం। దిడుటయు నుకబ్బమెన్నం। బడుసంతతులనగ దెరవుపల్లెదివికిన్॥

ఉ॥ అందొకకావ్యమొప్పు నఖిలావనిలో దిరమైయటంచుము । న్నందరు జెప్పువింటి సుగుణాకరదాని సృజించియిందుజే । న్నొందెదు చెన్నకేశవు మహోరగశాయినిభర్త జేసియా । నందము జెందజేయుమధునాతనపండిత మానసాళికిన్॥

క॥ అనిచీనాంబరములుమం । డనహారాశ్వములనిచ్చి నంజేకొని స । య్యన నేతత్కావ్యప్రే। రణకార్యన్వయము వరుస వ్రాయగడగితిన్॥

సీ॥ శకటతృపాటోగ్ర శార్వరారుణమూర్తిన్ హలకులిశాదిరేఖానువర్తి కాళియఫణిఫణాగ్రవిహారతత్పరంబార్యహృద్గేహదీపాంకురంబు । నతలేఖమకుటరత్నప్రభాకలితంబు లక్ష్మీకరోదరలాలితంబు। జటులారిరూప యుక్కటకాభిరామంబు భాగవతార్చనాప్రౌఢిమంబు। పత్రరథరాజవాహను పడజలజము । బుట్టిరచ్చోటఖల కులాంభోధికుంభ । జాతులజరాపగావరజాతులగుచు। శూద్రవిభులుయశోజితశూద్రవిభులు॥

గీ॥ అందునాలుగు తెగలుగా నతిశయిల్లె । వెలమలనకమ్మలనఱ

డ్డిపీగులనగ । తెలగలనగనువీరిలో తెలగవారు । ప్రబలిరుర్విస్థలిని శివ భక్తులగుచు॥

క॥ శివునకుమహానటాహ్వయ । మవుటనుతద్భక్తులీ మహామహులై గౌరవమొందుటపదవృద్ధిగ । దవిలిమహానాటివారనగ వెలసిరిలన్॥

గీ॥ తన్మహానాటిశబ్దతద్భవముగాదె । యిపుడుమహానాడననాంధ్రవిపులయందు । జెల్లెవీరికికకుబంత సింధురోరు । దంతినిభకీర్తి నెసగిరిధరణివీరు॥

క॥ ఈతెగలోజనియించెన్ । శీతగిరీందూరగేశశివసిరిబలా। రాతిగజాభయశముబెం । పైతగవెంకయ్యసత్కులాకల్పంబై॥

సీ॥ దర్పనిరంకుశోద్యద్వైరిశరధికిబాడబంబెవ్వానివేడబంబు। సమధికామలయశశ్శాల్యంకురాళికి విత్తనంబెవ్వానిపెత్తనంబు। భూమీసురులకుచింతామణీమందార రూపకంబెవ్వాని ప్రాపకంబు । నృపసభాజనరంజనీభూతకల్యాణ సూచకంబెవ్వాని వాచకంబు । భళిరయతడువిరాజిల్లెభవ్యనుకృత సారతటినీకృపీటవంతూళితాఖి। లాత్మకులపూర్వపూరుషోగ్రాఘకర్ద । మాళిభీమాన్వయుడు వేంకయాభిధుండు॥

క॥ ఆభీమావెంకయ్యామ । హాభీమాయోధనాగ తారిజయుని నం।ధాభీమానుజునజజా । యాభీమాభయశురామయాఖ్యునిగనియెన్॥

సీ॥ వరకవిరాగకవనమిచ్చిధాత్రినుత్కటకీర్తి నిల్పినఘనుడితండు । పరమహాబలము లెప్పాటపైనడరిన దెరలనిసద్గోత్ర వరుడితండు । ధీరచక్రములకెంతేరశ్మినిడి ప్రశస్తముగన్నలోకబాంధవుడితండు। కచ్ఛపమకరశంఖము ఖనిధానాతిశయుడైన సర్వజ్ఞసఖుడితండు । భూరికళలనెసగుమహాభోగియాతె । డనుచుదన్నుఖిలార్యాళు లభినుతింప । నలరెభీమాన్వయుడురామయాభిధుండు । మిత్రహృదయాంబుజములకు మిత్రుడగుచు॥

క॥ సచ్చరితుడురామయవేం। కచ్చమ్మనుగానియెమున్ను గరుడధ్వజుడా । పచ్చవిలుతుగన్నమనువి - యచ్చరతతిమెచ్చుబెండ్లియయినవిధమునన్ ॥



మ॥ పతికారంభవనీవకావళుల కన్వప్నద్రుశాఖోత్తమం । బతిధిశ్రేణుల కన్నపూర్ణస్వవయస్యా నీరజాస్యాళికం । చితయాగాశనధేనురత్నమగుచుం జెల్వొందెనారారయా । క్షితివేంకచ్చమచర్యలూహనలుపన్ శ్రీమాత్రశక్యంబులే॥

క॥ వేంకచ్చనురామయకున్ । గాంకాభయశుండు పుల్లయాఖ్యుడొదవెని । వ్వంకయగుశచికిహరికిక । లంకుండుజయంతుడుజ్వలతబొడమగన్॥

సీ॥ చేయుంచినాడునిశ్చింతతో బెండ్లిండ్లు వడుగులుబ్రాహ్మణవ్రాతములకు । పూయించినాడు దిక్పూర్ణేందుముఖులకు ఘనయశఃపాటీరకర్దమంబు । వాయించినాడు చెంపలుబ్రీల దోర్దగ్రములుసాచి నీచారిపుంజములను । కోయించినాడతిక్రూరపాటచ్చర ప్రాణిచ్చటలనంటబట్టిజట్లు । భళిగసాధారణుండెజంభగిపుసదృశ । వైభవాఢ్యుండు భీమాన్వవాయజలని । ధానజైవాతృకుండుమంధానశిఖరి । ధైర్యకలితుండుపుల్లయ్యధార్మికుండు॥

క॥ భీమాపుల్లయధీరుడు । బ్రేమన్ శ్రీకోటమాంబ ప్రియగాగొనియెన్। రామప్రభుడామిథిలా । స్వామిసుతంగైకొనినయశంబేపారన్॥

సీ॥ విభుడుగోపించంగ వెరచుటింతియెగాదు కనరానదేనాడు బెనిమిటిమెడ।చుట్టాలతప్పులెంచుటలెరుంగమియెకాదమర ధేనువుబాం।ధవాళికెల్ల । మార్గణశ్రేణుల మనుచుటింతియెకాదు వేమారుచనుదేరవిసువుకొనదు । ప్రాణనాయకసుహృత్సటలిబ్రోచుటయె కాదాత్మసోదరులయట్లాదరించు । భళిరయానాతికుద్దిజెప్పగగలారె। సతులుముల్లోకములునవిజనులువొగడ । నలరెభీమాన్వయుడగుపుల్లయ్యబోటి। వాఙ్మదనఘోటికోటమాంబావధూటి॥

క॥ పుల్లయ్యకుకోటమకుజ । గల్లలితశ్లోకమల్లికాసుమమాలా తల్లజయుతదిక్స్త్రీనిధ । మిల్లుండగురామదాసుమెరసెన్సుతుడై॥

సీ॥ గంతువై చెడి కురంగముకెండు ఖండముల్గాజిప్ప సెలనార్చుకొశలంబు । నాముకేనుగనుగ్రోవ్వారకేల్వట్టి గిపెట్టింపజాలినభీమబల

ము । పైవిహంగముగుంటి భారుచేవడిచుక్క దెగిపడ్డగతినేయుమగతనం
బు । పొదనున్న పులినిబిట్టదలించియెదురేగి కరుకుబాకునగ్రుమ్ముగడును
తనము । తనకేకలదంచుశూరబృందములుమెచ్చ । ప్రబలెభీమాన్వవా
యవారాశిపూర్ణ । శరజవిమతుండుహృద్గతనరహితుండు। దానవిజితఘ
నుడురామదాసఘనుడు॥

సీ॥ వసుధశల్యములెన్ని వ్రాల్చుకున్నదధీచి నిదానమునకె
ట్లుజెప్పవచ్చు । స్థాణువుదలవ్రీల దానెంతకొట్టిన పార్థుడెట్లుగుబలప్రథకు
దీటు । భంగసంహతిపెన్గ బడియెట్లోరలివశరధివచ్చునేగ భీరతకుసాటి ।
చుక్కవాలనకమిన్నెక్కినిక్కినిశాధవు డెట్లుకీర్తికిసవతువచ్చు । నను
చువిద్వత్కవిశ్రేణులభినుతింప । నలరెభీమాభిజనమహోద్యానపారిజా
తుడనవరతా పారిజాతుడర్థి । దైన్యహననుండు శ్రీరామదాసఘనుడు॥

గీ॥ శ్రీమహాలక్ష్మమనుమున్పరిగ్రహించి। పిదపహనుమాయమాం
బను బెండ్లియాడి । ప్రథితసౌఖ్యనిరంతరోధ్భాసియగుచు। తేజరిలెరా
మదాసుపృథ్వీతలమున॥

సీ॥ అవిముక్తముఖ్యపుణ్యక్షేత్రములు ప్రాణవిభుతోడ గూడిసే
వించెగూర్మి । నఖిలపురాణేతిహాసంబులసనాథయై పండితాళిచేనాల
కించె । సరసవిశ్రాణనచ్ఛలపయోదామృత శ్రీలవనీపనీపాళిమనిచె। న
విరతాభీష్టమృష్టాన్నంబుల నొసంగికలచుట్టములనెల్ల గారవించె । నౌర
యీయమ్మజేజేలయూరు పీడి నెలతయైక్రాలుచింతామణియెయటంచు।
తజ్ఞులెన్న నెగడె రామదాసుహృజ్జలరుహారోలంబశ్రీమహాలక్ష్మమాంబ॥

ఉ॥ శారదవాక్యసంపదకు సత్యవరాకృతి కార్యశత్రుసం । హా
రపటిష్ఠతావిధిక యవ్యవహారతకబ్జగేహవి । స్ఫారపతివ్రతోన్నతికి వా
ర్ధిపటాత్మజయీవికాసుర । ఊర్మోరుహశాఖయారహనుమాయమ నెన్న
వశంబెయేరికిన్॥

గీ॥ రామదాసధీర రత్నంబునకుకుమా । రకుడుకోటయాఖ్యుడ
కలుషుండు । ప్రబలెహీరహారపారదడిండీర । సదృశకీర్తియగుచుజగతి
యందు॥



క॥ ఈకోటయ్యకులాంగన । పాకారిసతీసమాన ప్రబలౌరమణ
మాం। బాకాంతమార్గణులకుమ । హాకల్పకవల్లినాగనార్యులుమెచ్చన్॥

గీ॥ ధాత్రిహనుమాయమకురామదాసునకును । గలిగిరికుమా
రవరులువేంకయసమాహ్వ । యుండుమరియుమార్కండేయుడు భయ
వంశ । పావనుడగుకుచేలుడుభవ్యగుణుడు॥

సీ॥ తండ్రియాశ్రీరామదాసుగంగాస్నాన సుకృతఫలంబువిస్ఫు
రణముగుచు । సర్వంసహాసుర సముదాయభావు కాశీర్వచనాళిప్రసిద్ధ
మగుచు । నిలవేలుపులకృపావిలసనంబులు సముద్దామప్రభావకందంబు
లగుచు । ప్రాంచిత్రైకాదశస్థానచరన్నవగ్రహ దృష్టిసతతంబుకరమొసగు
చు । వేంకయాఖ్యమార్కండేయువిశదమూర్తి । యగుకుచేలునిబ్రో
చుతనవనియుండు । పార్వతీపరమేశ్వరుల్ భార్గవీవి । ధులునుబ్రహ్మవిధు
లుగాతురలఘుకరుణ॥

సీ॥ పాలమున్నీటిలోపలితోణుంకులమీద చెలువరాపాన్పుపైజ
లజనయను । డెందాకవసియించు నందాకభీమాన్వవాయ పాథోరాశి
పర్వచంద్రు । డగురామదాసు కీర్త్యంగనామణితోడ సతనివంగడపువా
రందరుండు । రలచెన్నకేశవునలఘుదయారసంబున నీప్రబంధంబుభూత
లమున । నార్యవర్ణితమైధాత్రినలరుగాత । రాజతాపసుడగు భగీరథు
నిచర్యలాలకించినవారికినజరవాహి । నీజలస్నానపుణ్యంబు నెగడుగాత॥
ప్రళయాబ్ధినిర్మగ్న భయమూర్ఛితనలో జగమునమార్కండేయు గాచెనె
వ్వ । డనికిడాగ్గొనినయర్జునునకువిశ్వరూప శ్రీనిజూపినపరుడెవండు। సు
రరాజలిగబిట్టుగురియించురావాన కచలమెత్తినవిర్మలాత్ముడెవడు। వత్స
గోపార్భకావళిగొన్న ధాతకు మహిమజూపినభక్తమాన్యుడెవడు । శ్రు
తులబుట్టినస్థిరై తేజాసతులజంపి । తత్తరసమునవెవడుగోత్రనొసగించె నత
డుశ్రీచెన్నకేశవుడామహాను । భావుడలచినయిష్టార్థఫలములరుదే॥

క॥ ఏవంవిధచర్యానకున్ । సేవితసురవర్యానకు వసితసూర్యాన
కున్ । పావనకార్యానకజర । గ్రావశ్రీధైర్యానకు జగద్ధుర్యానకున్ ॥౧॥
సరసిజభవాండకోటర । భరితయశశ్శమితశశ్యపర్యంకునకున్॥

వరశీర్షసహస్రాహీ శ్వరపృథుభోగాంతరాళ పర్యంకునకున్ ॥౨॥

కోవిదసన్నుతపదరా । జీవునకున్ యాతుధానజీవోగ్రగసీ । దా
వునకు చెన్నకేశవ । దేవునకున్ నిష్కళంక దృఢభావునకున్ ॥ ౩॥

రాసోల్లాసునకు నుత । వ్యాసునకున్ శాతకుంభవాసునకు నిరా
యాసునకున్ గుడిపూండిని । వాసునకున్ రక్షితాత్మపద దాసునకున్ ॥ ౪॥

శౌరికి సమస్తజగదా । ధారికి కేవలరథాంగధారికి వరభీ। మారా
మాదానహృదయవి । హారికి కమలాచ్ఛచిత్తహారికి హరికిన్ ॥౫॥

వరజనకసూక్ష్మగోత్రా । కరవిస్రుతరామదాసకరకృతపూజా।
భరణునకున్ శరణాగత । భరణునకున్ భక్తలోక భవతరణునకున్ ॥ ౬॥

ఇట్లొసంగీకృతంబుగా నీప్రబంధ । మేను గావించి వినుపింతు నిపుడు విను
ము । చెన్నకేశవదేవప్రసన్నభావ । సముచిమాకారకలుమవసీకుతార॥

ఉ। శ్రీమృదుపీఠదంఘ్రిప పక్షితధారాంహానంబు సజ్జన । స్తోమవి
పత్కదంబనిమ ఘపక్వవసీదహానంబు భూరిని । స్తోమహితాత్మిష భావజబ్జ
జాతవనత్ప్రహానంబజనప్రియంబ్ । నైమిశనామపుణ్యగహనంబు జహత్క
హానంబు భాసిలున్ ॥

సీ॥ శోకంబునకు నోతుశోకంబునకు నుగ్ర కాకంబునకు పైకపాక
ములకు । కోకంబులకు నజానీకంబులకు నుష్ట్ర భేకంబులకు దందశూకముల
కు । కోలంబులకును శార్దూలంబులకు సింహజాలంబులకును శుండాల
ములకు । మకరంబులకు తేనునికరంబులకు భూరికిశోరంబులకు బకప్రక
రములకు । శ్యేనములకు గపోతసంతానములకు । పీతులకు మర్ద్దవుద
న్నపోతులకును । సహజవైరంబు మానస్మై యహరహంబు । మహితమ
య్యెత దాశ్రమమహిమ జేసి॥

ఉ॥ అచ్చటద్వాదశాబ్దమితమైన తన్మైత్రి నెనంగు సత్వరం । బ
చ్చుగ శౌనకాదికమహర్షిసమూహము లాచరింపగా । వచ్చె రథాంగధో
త్క్రిమణపర్తనసూతుడు సూతుడట్టిపె । నచ్చకొనంగి రక్కథకరాజున
కర్చలు దద్విరీశ్వరుల్॥



క॥ ఈవిధమున శౌనకముఖ । కోవిదులు చితార్చనలిపి గుణగణ
ములనెం । తేదాసిగన్న వ్యాసాం। తేవాసిం బల్కి రప్రతిమహితమతులై॥

ఉ॥ సూతమనోనుషక్త సరసూతభవద్వదనాంబుజాతని । ర్యా
తకథాతరంగిణిపురాతన పూనుపకీర్తిఫేనసం । ఘాతసమేతయై శ్రవణగ
ర్తములంబడి సాగినిండెవి । ఖ్యాతము దాత్మదంభసలిలాయశముల్ జగద
ద్భుతంబుగన్॥

క॥ మునుజెప్పినట్టి యితిహా । సనికాయము జాలదేకొ నరబోకు నీ
వీ । రసకుము హరిభక్తకథల్ । వినితనివిబొసంగెనన్న నిజ్జగలండె।

చ॥ హరిసుతమై చెలంగిన సురాపగ నేగతి ధాత్రికిన్ । బర పెభ
గీరథుండతని వారివారిసి మజ్జనా ప్లిని । ట్లిరిదిగ సాగనంపె నిగతౌక
ము నాకము జేరజమ్ము జే । సరణి నిమిగింగిపిడె వృషసంగ మగంగను దెల్పు
మంతయున్॥

ఉ॥ నావిని రోమహర్షణి వినమ్రత గో వచియించె నో మునీం ।
ద్రావళులార మీరలనగ నట్టి కథగ్గిం వేస్రపారసు । శ్రీశిభ సేకుణోత్కరము
చేనను పెద్దగ జేసివిందురిం । తేవిబుధేంద్రులాత్మ గుణసీడజవాక్యములాను
కైవడిన్॥

క॥ రాజర్షియగు భగీరథ । భూజాని చరిత్ర దెల్పి భువనోన్నతి
గా । నాజన్మము ధన్యంబై । తేజరలగ జేయుదున్ సుధీమణులారా॥

క॥ అనిముడివిగజనుఖాజాం । గనలకు బ్రణమిల్లిపల్కె గ్రమ్మరఘు
సాం । తనటన్నిటలాంకుశిరోం। గణతటినిచటులభంగఘుటితార్భటులన్॥

మ॥ అమిత శ్రీమణిరథ్యసాధ గరుడాశ్మాలోకఘూసాశనో । ద్య
మభాస్వద్రధరధ్వకేతు పటవిర్యద్వాతజాతోద్ధుతో । ర్వమురద్వీపవతీత
రంగసలిల వ్యాప్తేంద్రపూర్మధ్యమ । ద్యుమతా యోధ్య యయోధ్యబా
ల్చె సకలోర్వీనాయకారాధ్యమై॥

మ॥ ననుసంరక్షణ జేసితీవుమునులో నన్నిల్పినిన్నట్లు జే। కాని
గావందగునంచు దార్కొను మహాకూపారమో నాగనా । గసివాసాలిగ

భీరఖేయమలరెఁ గస్పష్టైదన్మధ్యగో । త్రనుజక్రాగము భంగిసాలముశిఖాగ్రస్పృగ్విధాత్రండమై॥

మ॥ రవళించుంబురిపైజయానకమునా ప్రాసాదసద్గోపురా। గ్రవసత్కృత్రిమమూర్తిఁహాస్తిరిపురె ఖాదర్శనోద్యత్సము। ధ్వనహ్వాన్మత్స రరాశిమధ్యగతమా తంగాదిదుర్వారభై । రవసిర్హాద్రిదమిపాభద్రిధన్యరు ఝురీరంగత్తరంగార్భటుల్॥

ఉ॥ రావెఘృతాచి రంభ బుధరంఁని హేమ కుమారిభూరిహా । ర్యావధిసీవిధిన్నిలుచు టందమెదిన్యశరీరఖూరయ । జ్యావళిడాసెనింద్రవభకాటకుబోదరియుద్యోనంచునా । ప్తావనిభృత్కుచాళియను నక్కడికాంచనపుత్రికాతతిఁ॥

సీ॥ కలశార్ణవోర్మికా వళులంచుజలశాయి యోగనిద్రానక్తి కుత్సహింప । మగనిచేసెలవఁది నగజాతతనవుట్టినిల్లీడయని ప్రేమనేగుదేర । కలధౌతగిరిశృంగములుగాదలచి విహారముసల్పమేఁడనీరధుడుడాయ। బృహదభ్రినిమ్నగాలహరులఁచని జహ్నుడనుమానివివృతాస్యుడగుచు జేర । నలరెకవచితవేఘోండతిలముత్తైన । పృధుతరోత్సేధ సౌధవర్గేద్ధహీర । మండలమయూఖ రేఖాసముగ్రరుచిర ॥ శుచిరుచిప్రచయంబుల చోచ్చటబలసి॥

ఉ॥ సారఫలచ్ఛదోత్కర నిశాంతములంద్విజపాళికెల్లన । త్కారమెుసంగిధీరసహకారత రుల్వనిబొల్చునుండగా । సారఫలచ్ఛదోత్కరనిశాంతములంద్విజపాళికెల్ల । సత్కారమెుసంగిధీర సహకారిత రుల్వనిబొల్చునిబ్బెనో॥

సీ॥ అలఘుకళానినాదమెన యుంగగుహా రునిచేతనోడెమ। న్నలచ... ...చెట్టి చతురాస్యశరిష్టము లిచ్చుదాజగ । త్తులకస్వదర్శనంబు...బుధుండతచెట్టి బుధుండటంచుని । చ్చలువిహసించుచుండు సుర సాస...ఘమువతత్పురంబునఁ॥

మ॥ మతివిద్యాజితజీవ శేషులగుచుఁ దూర్కవెల్తురేకానిదు। ర్గతిగాఁ చెప్పుడుజీవ శేషులురు శౌర్యశ్లోకరేఖాప్రధో । న్నతిధీకార్యపిరాజ



మానీలగుచుఁ వతిఁంతు రేకానినం । తతముద్గారవిరాజమానులు బఱాంతర్వాసరాజాగ్రణుల్॥

ఉ॥ శ్రీకిరవైచెలంగు నిజజీవనమెన్నడుగోలుపోదో । పాకరు రాకకుబ్బెడ రన్యులకెత్తరిచేదుభూమిభృ । న్నైష్కమునుంచ రవ్వలవహించరు భంగకదంబకంబుర । త్నాకరులయ్యుజిత్రమున నప్పురినుండు వణిక్శిఖామణుల్॥

ఉ॥ కోరిననీరరాశిగలకోడెను వేలుపులొక్కగోపతిఁ । ధీరతనీడయాపశుపతింగని వేడినరెంటిగట్టదో । శ్శీరమమర్చినన్ని ఫలసిద్ధివహింపక రాముదూరునే । రూరకవద్రియ్యజాల్గొనుట యెుప్పనెయందురుశూద్రులప్పురిఁ॥

చ॥ రవిరధరథ్యరశ్మిఫణి రాజిమృణాలములంచుకుండము । ల్దివికెగనెత్తుశైలవిత తిందిలకించిప్రతీభశంకచే। దవిళిరదమ్ములందోలుపుదారుణ ఘీంకృతులందిశావశా । ధవసమితింగలంచుమదదంతి కదంబకమప్పురంబునఁ॥

సీ॥ ధారాధరములయ్యు ధాత్రిజరించుచెత్తరినిమిత్రావరోధము వలుపవు । కాండంబులయ్యు నిక్కముగనిజారోహ కుష్టంబునభివృద్ధిజొన్పచుండు । హంసంబులయ్యుదా మనిశంబుమాన సాతిక్రమక్రీలచేదిపురుచుండు । గంధర్వతతులయ్యు గడువిమానంబువహింపనిధాటిచే జెంపుజెందు । దిరుగదుపరదుగాఁ ధఃప్రదేశమెనసి । హరికులంబయ్యునవిబుధులరిదినొంద । తేజరిల్లెనారట్టకాంభోజయవన । సింధుజముత్తైనసప్పురీసైంధవములు॥

క॥ సగరుడువిక్రమనిర్జిత । సగరుడునిజదోర్నిరస్తసాహసరిపుణా । సగరుడుసత్వరమెుల్లా । సగరుడుడానగరిబెంపె సగబాలించుఁ॥

సీ॥ తనకీర్తిఁనటికిను తమరసజ్ఞాంత రంగములు విఖ్యాతరంగములుగాగ । తనశౌర్యరవికమిత్రచ్ఛటామద వికారములు ఘోరాంధకారములుగాగ। తననిర్వపణకల్పమునకుసూరీంద్ర చక్రములనారతముచ

క్రములుగాఁగ । తనకళాకాసారమునకు నిర్మలభావ కవులునిర్మలభావక వులుగాక । బరఁగెనిజమృదు పదయుగభరితశరధి । పరిధిగతవిశ్వధరణీ విభాసిరాజ । శేఖరశిరోగ్రమకుట నిచితబహుళారు । తరమణివిభుండుస గరగోత్రావిభుండు॥

క॥ అతనికిఁగలారుదంచిత । మతులుసతులుగేశినీసుమతులిర్వురు న । న్నుతచతురాలాపసర । స్వతులుగళావసతులనఘచరితజితసతుల్॥

క॥ క్రూరకృపాణోరువిభా । భారోద్గాఢాంధకారపటలాంధీభూ తారియయిసార్వభౌముం । డై రనబాలంచెసగరుడార్యులువొగడన్॥

సీ॥ గండముల్లైల్యంటికప్రదేశములందు దుష్కీర్తిపల్యాలస్తోమ మందు । గాఢవిసారము ల్గాసారతతులందు మధుపపంకులను సుమంబు లందు । కఠినంబుకలకంఠ కంఠీకుచములందు లేమిలేములమధ్య సీమలం దు । పల్లవొల్లాసంబు పాదపావళులందు యతిభంగములుకుకావ్యంబు లందు । కుటిలవర్తనసతులముంగురులయందు । చంచలతకామినీదృగం చలములందు । గానికానంగరావుసగరమహీవి భుండుదాజక్రవర్తియై యుండునాడు॥

ఉ॥ హైహయతాళజంఘముఖరాహితరాహుతపర్వతాంబుము। గ్వాహకుఁడైనయాసగరపార్థివుకీర్తివధూటివిశ్వస్రు । గ్దేహినినవ్విసా రకరిరాట్ప్రవరుంగనికాలుద్రవ్విస్వ । ర్వాహినిగ్రోవ్వజివ్వికడు రాజిలె సర్వదిగంతవీథులన్॥

గీ॥ ఇటులనారాజమౌళిసర్వేలనేలు । తరిఁగడిచెకొంతయంతనా ధరణికాంతు । కాంతలనపత్యలై యున్నఁగనివిషాద । సహితుఁడైపల్కెన తడాత్మసతులఁజూచి॥

సీ॥ పుత్రునెత్తనిమహా భోగంబురోగంబు సూనుండుదవ్వులనిమే నుగ్రమాను । తనయుండు మెలఁగుచుండనిగీము బెనుతూముశిశువుపల్కఁడ గన్నచెవులుగవులు । ప్రియసూతిఁగనక శోభిలుకన్నువలకన్ను తనుజు ముద్దిడనియాననము పెనము। పట్టికిచనువీని భావంబుదావంబు నందనుం



డొదఘనినాతిక్రోతి । వసుధనిర్మాణవశుఁడైన వానినోపటి । వ్రాతరోతగ దాకీరవాణులారా । కావునసుతార్థినైన నన్గావనెద్ది । గలదుపున్నామ నరకసంగతికిఁబాపి॥

చ॥ అనవుఁడువారలిట్లని రహస్కరతేజపిత్ర్యాణభారమే । య నువునబాపవచ్చు తనయాగ్రణిగల్గకయున్నవంశపా । వనుఁడగునందనుం డనెడి పండుజనింపని సంసృతిచ్ఛలా । వనిజమహానిరర్థకవిభావిభవం బువహింపదేభువిన్॥

క॥ కావునసంతానార్థుల। మైవనివపమాచరింతమనిపల్కినసనా । భూవల్లభుండుమంత్రిజ । నావళిరావించియనియె ననఘుతరోక్తిన్॥

ఉ॥ సంతతిగోరిఘోర వనసంతతిలోనేకచోదపంబుని । శ్చింతు లమైయొనర్తుమువచింతు వినుండికమేమువచ్చుప । ర్యంతముదన్వదంత మహీయంతయునేలుఁడి దుర్మదారిపీ । రాంతకచర్యయుక్ బుధజనావన ధుర్యతలాచరింపుచున్॥

శా॥ దేవబ్రాహ్మణవృత్తులఁగరము నంధింపంగరాదుజ్వల । ద్దా వంబై యదివంశగహ స్థానంబులంబాకిభ । స్మావాలంబులొనర్చునాయు వయునుద్యద్ధీ)యునార్జించుగో । త్రావృత్రాహితులిట్టికర్జము లొనర్చం బోవరెప్పట్టునన్॥

చ॥ కటికితనంబుగల్గు నధికారులఁగూరుపరాదువారలొ । క్కట నరిమొందుజేసిభువికాపులలేవగదోలితద్గృహా । త్కటతరదారువేణువుల గట్టిగబాకపుగట్టుతానటం । చటమటసేయనయ్యఘము లక్కటభూవి భునాక్రమింపవే॥

క॥ మహివిభుడఖిలాంగంబుల । నహరహమరయమిఘటించున హీభయమారా । యహిభయముకంటెలయస । ప్తహయోగ్రతకంటె బెట్టిదంబై యడరున్॥

గీ॥ అలఘుమంత్రపరిజ్ఞానియగునరేంద్రు । డహిభయోద్రేకమ డచి జెన్నారుచుండు । నలఘుమంత్రపరిజ్ఞాని యగునరేంద్రు । డహిభ

రోద్రేకమడఁచిరెన్నారినట్లు॥

చ॥ పరుషపరుషణనరుంగెడపి వైచినవాడునృపాలకింకరో । త్కరములచేతఁజిక్కి యధికారిపురస్థలి దీనుఁడై గడుం । శరణనిగోడు నల్పను రిచావునకుందొలగించెనేనియు । ల్లరికొనసాగదేసుజనులన్మననిత్తురెథా త్రిటక్కరుల్॥

గీ॥ బందిగాంద్రుకుఁణ్మద్గుహావనములుక్కి । పట్టుగానుండినృపు నిచేపట్టువడక । యున్నసమ్మించికడతేర్పనుర్వరాధి । పతికఘముసెంద దందురు పరమమునులు॥

ఉ॥ కారదొలంగిబారినను కత్తెరకాని తెలారమూకబి । ట్టారసిపట్టజాలక ననంతికదేశికునొక్కనిందదా । గారముసేర్చినట్టివనిగాంచి విచారణజేసిచారశిక్షారచనంబునల్పనిరసావిభుడొందడెనారకవ్యథల్॥

చ॥ కనుఁడఖిలంబురోయ కొకకార్యముజేసిన రేడొకంబుజూ । లెనసినరోతనాతిగని యీచెలినెవ్వడుగూడెనంచుమం । త్రినడుగవాని దేనిజపురిం జరలాడుచుదూపురాసినీ । టనుపాడిసున్న ముందదుపుటక్కరిబట్టడెనిక్లెరుంగనో॥

గీ॥ ఆనుచురాణ్ణీతులతడుబెక్కాడిరాజ్య । భరమశేషంబుమంత్రి శేఖరులమీద । నిలిపిపత్నియుగంబుతోనిలయసీమ। వెడలెశుభనివ్వనములతోద్విజులునడువ॥

గీ॥ వెడలివనులుధునులు వీళ్లుబోల్లురయాన । గడచితుహినగిరినికటకకఠోర । గహనసీమజొచ్చెఘనమృగారవహాళా । హాళికిగలుగుసతులయళుకుదీర్ప॥

స్రగ్ధర॥ సగరుండక్కానసేలంజనిచని కనియెజాతినిర్వైరశాన్వ । స్మృగధామంశాస్త్రచర్చా మృదులవచనయుక్త్రిజతుష్టారభూమిం । జగదంచత్త్రైకసామంశరదధగతాసారవైతానబర్హి । ర్విగళద్ధూమం । దపోసంవృతయమినిరతప్రేమకర్మంకిసీమం



క॥ కాంచిపరిగ్రహయుగళస । మంచితుడై చొచ్చి మునులకానతులిడిని । ర్వ్యంచితమతినలరునదీ । ట్కాంచీవిభుజూచియనిరికర్మందిజనుల్॥

మ॥ పులులుంబొబ్బమెకంబులుంగలభముల్ బోత్రుల్సివంగుల్ వృకం । బులుఘూకంబులు జంటనాల్గడుగులం బొల్పారుజీవుల్ రొద ల్గలిగింపంగలగుండుగన్నగహ నత్స్మమండలంబొరకాం । తలతోజొచ్చితివచ్చితీడకు నిమిత్తంబేమొకోరాణ్మణీ॥

క॥ అనియుచితసపర్యావ । ర్తసములునలుపంగనప్పతంగాన్వయపావనుడఖిలమునిజనంబుల । గనిమ్రొక్కివచించెవినయగౌరవఫణితిన్॥

క॥ సంతానార్థులమైబుధ । సంతానులమిమ్ముజూడ జనుదెంచితిమూ । వంతననుంగునిలిపిమా । వంతందొలగింపమీరెభారకులుగదా।

సీ॥ కావుకావనువేళ గనిముద్దుసేయుట కూర్చుండుదరినెత్తికొని మురియుట । పారాడునాడుగొప్పగగారవించుట నిలుచుపట్టునచాలనెమ్మిగొనుట । యడుగుబెట్టగసేర్చునదననింపూనుట భాషాభ్యసనమందు పల్లవిలుట । గజ్జలందెలుమ్రోయ గారాగనలరుట విద్యలాజించుచో పేర్మిబడుట । గలుగునిసువులెసంగిన ఘనులకవని । నట్టివారిభవములు పుణ్యవిభవములు । గాననసపత్యభోగముల్గాననగత । రాజచంద్రికలో మహానిరాజులారా॥

గీ॥ అనవుడువసుంధరేంద్రునకనిరిమునులు । భృగుమునీంద్రుండుదావకాభీష్టదాయి । యగునతనిగూర్చి జపియించుమనినతద్వి । ధానమెరిగితపస్సుముద్యమతదాల్చె॥

క॥ ధరణీభృద్విభుడునిజాంతరభాస్వద్భ్రుగుడగుచు బాదలెనిశ్చలుడై । ధరణీభృద్విభుడునిజాం । తరభాస్వద్భ్రుగుడగుచు బాదలుటబ్రింజే॥

క॥ అత్తరిమిత్రకులాధిప । బిత్తరులంగాంచిమానిపికవాణులు

రో। షి_త్తతులుదులకురారుజ। గత్తలమునవీరికనిపొగడిరిపగిదిన్॥

ఉ॥ ఒక్కెడదెల్లబోకకరినోద్ధతిజూపక వాగువంకలం। జిక్కకె గోళవైఖరిని జెందకమూలలనీగకున్నవా। ర్మక్కలనీలశైవల సమూ హమిళిందదృఢాంధకారముల్। జక్కనివీరివాల్గురుల జాయలకుంబురు డింపగానగున్॥

సీ॥ లావణ్యవారాశిలహరిలోనుండి నిక్కవెలుంగు వెన్నెలగీము మోము। రామేయమోహనా రామసీమోద్భాసి హేమమైనిరతమింపె క్కముక్క। భాసిల్లురతిసుమాంబకుబులోకముగెల్చు మతిజెక్కెము లుదీర్చుమాటిక్కెచూటిక్కె। శ్రీశష్కులికనవశ్రీలనోడించు చొప్పునశు భాకారముల్బానువీను। లలఘురేవటరాజ మంగళముగళము। ప్రసవ నాళీకకరధనూరమలుబాములు। భవ్యమకరందసారంపుబావిమోవి। భ ళిరవీరలగొనియాడ బ్రహ్మవశమె॥

గీ॥ సరసమైనమహాగంధ శాదమందు। మునుగుటయుభూరికం కణములువహించు। టయునువివరింపగానీమిటారులకర। శాఖలుబిసం బులనుటకుసందియంబె॥

గీ॥ అరులసరిదంతరంబుల కనిచిశాత। కుంభకుంభంబులనుమ హోగ్నులగలంచి। గిరులగదలంగనీకాగివరలెభళిర। వీరికుచయుగ్మము లుశుభాకారపటిమ॥

శా॥ నూగారాశుగభోజిగానలనుధాంధోమార్గమాజహ్నువు। శ్రీగాధోర్మలగున్వళుల్ సుడియెబో శ్రీనాభిచక్రంబుతో। దూగున్భా రినితంబదేశమనటిన్ దూలించునూరుల్సరా। లైగోత్రాధిప వల్లభీయు గళికా హాజంఘలొప్పారెడిన్॥

గీ॥ చక్కదనమనుకొలనిలో నుక్కమీరు। చున్నతాబేళ్లుద మ్మలైవన్నెగాంచె। వీరిమీగాళులడుగులయారెవేరు। గలదెకరపదన ఖపాళికలకుడులకు॥

కం॥ అనితమువర్ణించెడిముని। వనితలతోజనువుమెరసి వారి



రుపుతుశా। యనికూర్మింబరిచర్యలు। దనరుపనారాజొనర్చె దపము గ్రముగన్॥

సీ॥ చటులనిదాఘవా సరవరుపర సమగ్రముగపంచాగ్న్యంత రాళసీమ। భయదవార్షికఘనస్రపటలంబులందు దుర్భరవిరావగణాగో త్రాతలమున। నలఘుదుర్వారశీతాహస్సమితికంఠదఘ్నపద్మాకరోదము లలోన। వానంబుచేయుచు మాసర్వాయనహాయనాభ్యసహారియై య నశనవిధి। క్రమముగాదాల్చి వల్మీకభాజితనుడు। శకునరచితకులాయ శాస్వజ్జటాగ్ర। దేశుడైనిస్తరళహృత్క శేశయుండు। నైతపమొనర్చు చుండెసూరాన్వయుండు॥

శా॥ ఈమాడ్కిందపమాచరింపభృగు మౌనీంద్రుండు సాంద్రా నుకం। పామూంచన్నయనాంచలుండగుచు నవ్యాధిన్ చ్ఛదామండల। స్వామిగ్రామణిచెంగటన్నిలిచె నీశానుండుదాదొల్లి ను। త్రాముంబ్రో వదగ్రదేశమున నాస్థంగ్రాలుచందంబునన్।

క॥ ఈతెరగునబ్రత్యక్షుం। బైతాపసమౌళిభృగు సమాహ్వయు డాగో। త్రాతోయదవాహుంగని। చేతోమోదంబెసగ వచించెమృ దూక్తిన్

ఉ॥ ఏలికమున్నతావక హృదీప్సితముల్ఫలితంబులైచనుం। జా లికసీతపంబుపరుష క్రియజూపకుమీతదగ్నికిం। దూలికలయ్యె లోకము లనుజ్ఞనొసంగితి లెమ్మటంచుభా। మాలికులీనుపైజిలికె మౌనివిభుండు కమండలూదముల్॥

క॥ అవనీశ్వరుశీర్షముపై। కవిగురుడు కమండలూదకంబులుజి ల్కన్। దవిలినతపశ్రమమువిడి। పొవబాసినవీతిహోత్రు బోల్కెవె లింగెన్॥

క॥ రాజన్యుడుభృగుపాదస। రోజన్యస్తోజ్వలచ్ఛిరోదేశుండై। సౌజన్యంబునవతియిడే। భాజిన్యాయుడలమౌనిరాజిట్లనియెన్॥

మ॥ పఃతుష్టాత్ముడనైతినో సగరభూపా నీతపశ్శ్రీకి బల్యురసత్పుత్రులవిక్రమాఢ్యులభవల్లోలాత్ములందొక్కసుం । దరిగాంచుంగులదీపకుం గఠినచేత స్సారుగాంచుఁ బ్రభవ । త్తరుణీరత్న మొకర్తెయన్న నృపకాంతల్ మ్రొక్కి హర్షాశితోన్॥

ఉ॥ తారువచించిరిట్లుగుణ ధన్యవదాన్యవతంసవిక్రమా । దారులబల్వురన్సుతుల దాగను నేతరలాక్షి వంశవి । స్తారకుడేకళావతికె సంగునిజంబెరిగింపుడన్నన । వ్వారిజసంభవాత్మజుడు వారిగనుంగొనిపల్కెనాదృతిన్॥

క॥ మీరేగతిగోరుదురో । యారీతింబుత్రులుదయమగుదురన । నయో । ధ్యారాజాగ్రమహిషిమధు । ధారాధారోక్తిననియె ధాత్రాత్మజుతోన్॥

చ॥ ఘనగుణవంశదీపకులు గానికుమారకులెందరేలన । త్తనయుడొకండెజాలు ఫలితంబుగ జేయుమువాదుకోర్కెనా । వినినృపదార రెండవది వేగ వచించెమునీంద్రబుత్రునో । కనిగనుసెంత పెద్దయొస గంగదెనాకమితాత్మజన్ముల౯॥

చ॥ అనవుడువారికాకరణి నాయతిరాజువరంబులిచ్చియొ। య్యనృపుశోవచించె భవదగ్రకులాంగనకొక్కపుత్రకుం । డునుదరువాత దానికి తనూభవులర్వదివేలుశౌర్యవ । ర్ధనులుదయింత్రుతద్విధము తజ్ఞనుతాయెరిగింతువిన్మిక౯॥

చ॥ క్రమముగనగ్రభామిని కొకండునురెండవదానికొక్కతుం । బముప్రభవించుదత్ఫలముప్రస్సియు షష్టిసహస్రబీజనం । ఘములిలదేజరిల్లునవిగ్రచ్చరసాజ్యఘటంబులందునె । య్యమెసగనిల్వగాగొమరులై వెలుగొందుదురర్కవంశజా॥

క॥ అనిమానిపల్కిపీడ్కొ । ల్పినసాకేతంబుజేరివిశ్వధరిత్రిన్। దనదక్షిణదోరంతర । ముననిడిపాలించెరాజపుంగవుడాస్థ౯॥

క॥ ప్రియలిద్దరితోనిజపురి । కయనయవిధిసార్వభౌము డరుదెంచిసుఖా । శ్రియుడయ్యెననినసూతు౯ । నియములడిగి రవలికథమనీషోత్సుకులై॥

మ॥ నతహృత్కంజవిహారహారసుర కాండగ్రావరాజేందుభా । సితకీర్తిద్యుతిసారసారహత దుశ్శీలాదితేయానుహృ । చ్ఛ్రితఘోరాంగకవారవారణవిప త్సర్వంసహాభృత్ప్రిమిం । డితదుర్వారశ తారతారగుడిపూడిగ్రామవాసాచ్యుతా॥

క॥ మధురాక్షసాహితసుధా । మధురాలపనాభిధామమదనజనకసా । మధురీణజనవినుతనల । మధురాజరతీశరూప మంచదహీశ॥

తోటకము॥ సదయాసదయాత్మకసాధుమన । స్సదనాకదనాగతశత్రుజయా। ప్రదరావిదురాదికవర్ణితపా। రదనారదనాగపరమ్యయశా॥

గద్య॥ ఇది శ్రీమద్దక్షిణామూర్త్యష్ట మూర్తిదాక్షిణ్యానులబ్ధ
కవితాసార శౌనకగోత్రా రామపటీరసుభద్రాంబికా
పిచ్చయామాత్య కుమారతురగాన్వయ పయ
స్సాగరాభోగ తారాజార వేంకట కవిధీర
ప్రణీతంబైన నిర్వచన భగీరథోపాఖ్యా
నంబను మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము.





## నిర్వచన భగీరథోపాఖ్యానము.

### ద్వితీయాశ్వాసము.

శ్రీమద్భీమాన్వయతిమి । ధామవదాన్యాగ్రరామ దానవరదవ ।
ద్మామహిళాధిపనుతన । ర్వామరగుడిపూడిహరిదయాంబుధిలహరీ॥

గీ॥ అవధరింపుముశౌనకాద్యఖిలపారి । కాంక్షులను గాంచిపల్కె
నక్కథకమౌళి । సంతతికి నేగిక్రమ్మరసదనమునకు । సగరుడరుదెంచిరా
జ్యంబునలుపునపుడు॥

క॥ దౌహృదరమసగరవరా । రోహాలుధరియించి రసితరుచులు
గుచాగ్రా । రోహములయ్యెఁ బాథో । వాహములపరంజగట్ల పైకిడిగు
గతిన్॥

ఉ॥ చిట్టుములుద్భవించెనిరుచెక్కులకుం దెలుపగ్గలించెవే । మ
ట్టిరుచించెనాలుకకు మధ్యమసీమసమృద్ధిగాంచెనీ । ర్వట్టుశరీరమంతట
విభావిభవంబువహించెనారుదా । రెట్టిగ మేచకచ్ఛవిభరించె నిలాపతినా
తిదోయికిన్॥

సీ॥ కళుకువజ్రాలకమ్మల తళ్కులనకెక్కగవసార తరగౌరకాం
తులూర । తరళకీలితనీల వరనీలరుచిబారె నాకుచాంచలసీమనల్పుబ్రా
మ । నాపన్నసత్వదం భావాతదినసరి ద్భంగోత్కరముజాయవళులుమా
య । నెదనుండబనిలేక మదనుండరుగబైటనుంచు ముల్కులలీలనుమ్మి
గ్రాల । రుచులుజెన్నారనూగారు రుచులమీర । శ్రాంతినిండారగమ
నంబునల్లువార । వరుననవమానములునిండెవాధిమేఖ । లాసుధాభో
జిరాజకళావతులకు॥

చ॥ ఫలదములైగ్రహంబులు నభంబునమంగళరాసులందుశో ।
లశుభవేళహేళికుల వృద్ధికరుంగొమరుంసుకేశినీ । జలరుహగంధి



గాంచెఁ గడచంద్రముఖీమణికుద్భవించెన । వ్వలసారకాయబీజసమవాయ
సహాయముసాధ్వపాయమై॥

ఉ॥ ఆసారకాయవిచ్చి విరియంబడసర్వదివేలవిత్తనా । లోవరి
లెన్ధరిత్రిఘృత యుక్తఘటంబుల వానినన్నిటిన్ । వాసిగనిల్పగానవ
యవచ్ఛటలేర్పడిశాఖకాళిమై । భాసిలెసార్వభౌముడును బంధుజనంబు
లుసంతసింపగన్॥

గీ॥ జాతకర్మాదిసంస్కృతుల్సల్పిమొదటి । పట్టికసమంజసాఖ్య
బెట్టికడమ । కొడుకులకు వేరువేరుగా నిడగజేసె । నామకరణంబులాధ
రానాయకుండు॥

సీ॥ పౌరలనేర్చిరిరిపూత్కరమాన సాంబుజాంతర దేశములభీతి
బొరలుచుండ । బారాడనేర్చిరి ప్రమదంబుబంధుహృత్క్రీడంబులందు
బారాడుచుండ । నిలిచియుండగనేర్చి రలఘుమోదంబు దాదుల డెంద
ములజాలనిలిచియుండ । నడిచిపోనేర్చిరెన్నగ పన్నగస్వామిపడగలన
న్నంటినడచితూగ । పలుకనేర్చిరి కపురంపుపలుకులొల్క । నాడనేర్చి
రిదిక్కులల్లాడుచుండ । సగరసర్వంసహాతలేశ్వరుడుగన్న । తనయులకు
బాల్యవైభవమెనయునాడు॥

చ॥ కులగురుడావసిష్ఠముని కుంజరునాజ్ఞ నిజప్రియాత్మజా । ళు
లకొగిచౌలముల్ వదుగులుంబొరయించి యనంతరంబవి । ద్యలుగ్రహి
యింపవారికి మహాత్ములనొజ్జలచెక్కుమందిరా । త్రిలకుడమర్చినిల్పెనృ
పతిప్రమదల్ ప్రమదాబ్ధిదేలగన్॥

సీ॥ బహుభాషలార్జించి బలులిపుల్శోధించి నీతిశాస్త్రంబుల
న్నియునునేర్చి । శ్రుతులభ్యసించి విశ్రుతిధనుర్వేదముద్దెలిసి పురాణ
పాళికెరింగి । యితిహాసముల్కథల్మతినాకళించి శాస్త్రంబులాందోళించి
సాములెల్ల । ఖురళికాంతరములగరచిస్మణిమంత్రముల తెరంగారసియ
లఘుహరుల । నరదములనేనుగులమీది కురుకువిధము । బడసిఖేటాసి
తోమరప్రాసకుంత । ముద్గరగదాదికౌశలంబులమెలంగి । రలవబలసాగ
రులు సాగరులుక్రమమున॥

ఉ॥ లోకపయోధరన్ కుటిలకుంతలనుత్పలలోచనన్ ధరి । త్రీకటినబ్జకంధర సరిత్పృథులోర్మివళిన్ సుధాధరన్ । కేకయరాజనందిని సుకీర్తినినయ్యసమంజసుండు శౌ । ర్యాకరుడాడెపెండ్లిసుహృదగ్రణులార్యులుబంధులౌననన్ ॥

ఉ॥ ఆతనికంశుమంతుడను నద్భుతచర్యుడుగల్గెనర్యసీ । కాతి భయంకరుండు పరుషాంశునిరాసితపంకజాతుడు । ద్యోతితకీర్తిమందరహితుండురు పుణ్యజనావనుండున । ద్వాతవికాసకారి వసుధావలయప్రవిహారహారియై ॥

క॥ చాలన్నాలిమితోసగ । రేలానాయకుడు గేశినీందుముఖిక దుర్ । లాలింపనంశుమంతుడు బాళింజేకొనియెగళలపాళింధాత్రిన్ ॥

గీ॥ తగినసంబంధములుదెచ్చి తనయసమితి । కెల్లనుద్వాహములు మహీవల్లభుండు । జేసెనసమంజసుడుదుష్టచిత్తుడాతతాయి । యగుచుగలచెనయోధ్యాపురంబు ॥

సీ॥ ఊరివీధులనాడుపౌరార్భకులబట్టి సరయూసరిద్ఝురీసమితిపై చు । స్నానంబుజేయువార్తవ్యాళికలశబృందములగాధజలాశయములనూకు । పురిలోనజెరలాడుతరుణీమణులకోక లూడ్చితెన్నునకడ్డముండిన వృ । జనువారిచరమదేశముజేరిమెడవంచి పైనెక్కినడిపించిపరిహసించు । భవనములుగాల్చిబిట్టుచప్పట్లుగొట్టు । బెద్దలేతేర గడుబిఱ్ఱబిగిసియుండు । నట్టియసమంజసునిపైమహాగ్రహంబు । నిండిసగరోర్వరాఖండలుండుబల్కె ॥

చ॥ తులువతనంబునన్ బుధవధూమణులంగలగించిచిన్నిపా । పలసరయూప్రవాహమున జారగవైచితనూనపాచ్ఛిఖా । వళినిలయంబులంగెడపివైచిననీచునినిన్నుపట్టిగా । దలచిసహించినన్ వెతగదాజగదాక్రమకీర్తిశాలికిన్ ॥

క॥ నిర్మనుజద్వీపంబున । దుర్మార్గుడవైననిన్నుద్రోయింతుభవ । త్కర్మంబిటుఫలియించెన్ । బేర్మివిడువుమింకజన్మపృథ్వీస్థలిపై ॥



చ॥ అనివచియించి యానరవరాగ్రణి డెందము రాయిజేసి యా । యసనతి దూరదేశమున కంపె గుమారులు బంధులాప్తులీ । రనికృపదాల్చిదండ విభిక ష్టలజేయకయుండిరేనియే । యనుపున నాజ్ఞ జెల్లు మనుజాధిప కోటుల కుర్వరాస్థలిన్ ॥

సీ॥ ఉరగేశ్వరస్ఫటోత్కరము లుఱ్ఱూతలూగగ విహారము సేయ గడగుచుండ్రు । శింశుమారరథాంగపాంశు మద్గ్రిహ ముఖ్యములుదూల ద్రిప్పుదురలఘుపటిమ । దిగధిపగ్రామణులైగడ జత్వరసాల కుడ్యముల్గూల నూకుదురుడాసి । సంగడంబులుజేసి సప్తాద్రుల నుమింటి తుదిదాకజిమ్మి పట్టుదురుగెరలి । చెదర నార్తురు నెలలోని జింకపోతు । నర్కవాజుల జూలూడ్చు రడ్డగించి । క్రూరులై సర్వవిష్టపక్రోడభయద । చారులై ధాత్రిసుమతి కుమారులపుడు ॥

గీ॥ ధారుణీస్థలి నిట్లుదైవారునిజకు । మారవరులును మనుమడాత్తఘనశౌస । నమువవర్తిల్ల సగరభూనాథుడేలు । చుండెనఖిల వసుంధరామండలంబు ॥

మ॥ సకలద్వీప మహీప భూరిమకుటస్థానోజ్జ్వల త్పద్మరా । గకలాపాంశు పరంపరానిచిత పత్కంజాతు డుర్వీశతా । రకరుండా సగరుండు నిండుకొలువై ప్రాజ్ఞచ్ఛటన్ మిత్రరా । జకులంబున్ గురుమంత్రులన్ సుతులనాస్థన్ గాంచి దానిట్లనెన్ ॥

శా॥ సర్వారాతి వరూథినీమదతమస్సంఘాత నూర్యాయి । తా । ఖర్వోత్తుంగ పరాక్రమాన్విత భుజాకాంతుండనై యర్ణవాం । త విశ్వంభర యంతయేలితి ననూనశ్రీలు గైకొంటినం । తర్వాణుల్గొసియాడవీరులగు పుత్రశ్రేణులన్ గాంచితిన్ ॥

క॥ చాలన్ గాలముదాటె వృ । ధాలంపటగాడ యివ్విధపు సంసరణో । ద్వేలాంబుధి ప్రాలుటయిక । నేలవితర్కింప నొకటి యేను దలచితిన్ ॥

క॥ అదిమొట్టిదంటిరేనివి । శదమూర్తిసుమేశు గూర్చి స్తవ

సంబోసరిం। చెవ రాజయోగ్యములు మీ। హృదయంబున నెంచి, జెప్పు డిపుడో కదార్నీ॥

ఉ॥ నావినివారలందరు జనప్రభుశేఖర తావకాత్మరా! జీవమునందు మెచ్చొదవ జెప్ప సమర్థులు లేరరుంధతీ। దేవిమగండుదక్కకులదేశికు నాఘును వేడి జేయుమ। య్యావరయజ్ఞమన్న నృపుడాయన కంజలి జేసి యిట్లనెన్॥

క॥ మునులకు మేటి వివనజా। సనుసూతివికులగురుడవు శాస్త్రజ్ఞులలో। ఘనుడవు మిమ్మానభలో। గనిపల్కితినానతిండు గరుణామూర్తీ॥

క॥ అనినన్వనజాసనసం। దనుడిట్లనిపల్కె ఘనఘనాఘనగర్జా। నినదప్రతిమోన్నతినొం। దినపృథుగంభీరవచన నియతిన్ ప్రీతిన్॥

క॥ సగరాధిప హయమేధము। సగరానిఫలంబులున్నె త్త్మాపాలమరు। న్నగరాజముగాదె సే। యగరాదే దానిసత్క్రియాశీలుడవై॥

శా॥ పంచైనోమహి భృచ్ఛతారమపపాప క్రూరమత్తేభరా। ట్పంచాస్యంబు హృదీప్సితార్థ దనుపర్వత్మారుహంబై ప్రకా। శించున్ రాజులకశ్వమేధము సుధాశిస్వామిచే మున్ను జే। యించం జేగుడు డీవితానములు నూరిష్టక్రియాసిద్ధికై॥

ఉ॥ నావుడు సార్వభౌముడు వినమ్రతతోనతులాచరించిన। ద్భావమునీంద్ర యీక్రతువపార కృపారస ముప్పతిల్లన। న్నేవిధిజేయ జేయుడొమహిన్ ధిషణుండు బలారిచే సుప। ర్వావళికెల్ల హర్షమొదవంబొనగింప నొనర్చునైఖరిన్॥

గీ॥ ఇవ్విధమునబల్కి యిలరేడు నిజసుతా। వళులజూచి వింధ్యవసుమతీధ్ర। శీతశైల మధ్యసీమ నీక్రతువాచ। రింప వలయుదగిన రీతిమీరు॥

మ॥ క్రతుశాలల్రచియింపజేయుడుసమగ్రద్రవ్యధాన్యచ్ఛటల్ జతగూర్పందగు యత్నముల్సల్పుడీ సమ్యక్సమిత్పాళులం। చితపుఙ్స్రుక్స్రువపంక్తులన్ గడువడిన్ జేరంగ జేయుండు మీ। రతిభద్రంబుగనంచు నంశుమదభిఖ్యాకున్స్వపౌత్రాగ్రణిన్॥



క॥ కనుగొని మునిరాజులుగల। వనములకున్ బుధులనంపి వారలనెల్లన్। మనయాగమునకుదెమ్మీ। జనవిభులన్నానొనర్పు సాన్యనిధీ॥

క॥ అనిపల్కె శ్రౌతవిద్యా। ధనులువిపశ్చిత్కులావతంసులు దనచు। ట్టినయన్ దత్కార్యాలోచ। చనలమహాసక్తి తద్రాసావిభుముండెన్॥

గీ॥ అంశుమంతునిపనుపున నవనిదివిజు। లాశ్రమంబులకరిగి హృద్యమగుభక్తి। సగరుహయమేధ మెరిగింప సంతసంబు। దొరలనల్లెను జడదారిదొరలదండ॥

సీ॥ హారితనారద పిప్పలాదకణ్వకణాద శాతాతపాత్రేయ జైమినులును। చవనజాబాలి గాలవముందపాల మార్కండేయ మాండవ్యగౌతములును। మాండకర్ణిసుతీక్ష్ణ శాండిల్యపులహాంగిరస భరద్వాజగర్గవ్రతులును। శక్తిమైత్రేయ కశ్యప పులస్త్యాగస్త్య కౌశికాష్టావక్ర కర్దములును। మరియును సమస్త రాజర్షి మహీసురర్షుల్। నిర్జరర్షుల్ వితాన మానేలరేడు। గరవుతత్తడి జన్నంబుగాంచు వేడ్క। నరుగుదెంచిరి సాకేతపురికి గూర్మిన్॥

ఉ॥ ఈగతిబాసవాలు దొరలెల్లను రానెదురేగుదెంచి భర్గసమానధైర్యుడు నరాధిపమౌళి నిజాగ్రగహ్వరీ। భాగముజిత్రరూపముల భాసిల హాటకరత్నజాలకా। భోగకిరీటమామునిసమూహపదాబ్జము లంట మ్రొక్కుచున్॥

క॥ కొనివచ్చివారినుచితా। సనముల గూర్చుండబెట్టి జనపతితత్పా। వనపద సేచనజలములు। తనపైజల్లుకొను చద్య ధన్యోస్మి యనెన్॥

శా॥ ప్రాలేయాచల వింధ్యమధ్య ధరణీ భాగంబునన్ యజ్ఞ

శా॥ లాభుల్ రాజ నివాసముల్ మునినికాయశ్రేణులు న్మంథురా।
పాళుల్ వారణ గేహము ల్భటజన వ్రాతాలయంబుల్ సమ। జ్యాలేఖల్
ధనధాన్యధామములు ప్రోద్యద్వాస్తు విద్యావిధిన్॥

క॥ గట్టిపనినలరుతక్షక। ధట్టంబులచేతసగర తనయులువరు
సన్। గట్టించితజ్జనులచే। కొట్టించిరిదారుపాత్ర కోటిరయమునన్॥

మ॥ సనిగల్కందులు తండులంబులును మాషశ్రేణులు వ్రా
జమా। వ నికాయంబులు గోదుములెప్పనలు దధ్యాన్నంబులన్నానులై।
పెనుగట్టల్పలె తేజరిల్లెదధి సర్పిక్షౌద్రదుగ్ధేక్షుగో। స్తనులుం గ్రాలె స
మృద్ధిగా నృపసుత వ్రాతంబులై యచ్చటన్॥

క॥ ప్రేమన్ సమిస్సుఖములుగు। హోమద్రవ్యంబులెల్ల నొన
గూర్చినయ। శ్రీమెరయకాయగూరలు। దామందమరించి రాజధానికి
వేగన్॥

ఉ॥ వచ్చినిజాత్మజుల్ సకలవార్తలు దెల్పిన చక్రవర్తి
దా। నచ్చటికేగనెంచి సచివాప్త భటాదిజనాళిమున్నగా। బుచ్చియు
బంధుభూమి పతిపుంజముతో జని యజ్ఞవాటికన్। జొచ్చితక్షణంబులిచ్చె
పరిశుద్ధతరర్త్విజ పాళికాదటన్॥

గీ॥ ఇవ్విధంబున దీక్షవహించిసగర। భూమహేంద్రుండు పు
త్రుల భూరిబలుల। జేరరావించి యజ్ఞవాజినిటుదెండు। వసుధనంతట
ద్రిప్పి తేపలయునసిన॥

సీ॥ అమితధారావిలాసమున జెన్నగుదాని సమధికకాండ
మై యమరుదాని। ఘనతదావర్త సంఘాతంబుగలదాని విశదప్రవా
హమై వెలయుదాని। నిబిడవాకీర్తికి నెలవైబరగుదానినిస్తుల ధ్రువ
శోభ నెగడుదాని। వరుణాశ్వసమితిలో బడిపోవజనుదాని కవికాస్పదం
బైన గరిమదాని। భావికాలాగత సురాపగావిశేష। సూచ్యమానాధ్వ
రహరిని సుభటులపుడు। దెచ్చినిల్పినరుత్విక్తతియువిభుండు। గాంచి హా
ర్షించి చెంగట గదిసినిలిచి॥



మ॥ జగతీచక్రభరంబ శేషము భుజాసర్పేంద్రునందుంచిశౌ
ర్యగరిష్ఠస్థితి దేజరిల్లు సగరజ్యాభర్త వార్ధ్యంబుధీ। నిగడుంరక్షణసేయ
దత్తనయు తెంతేడాసియున్నారు ప। ట్టగవచ్చున్ నృపతుల్పరాక్రమ
నిరూఢశ్రీవ్రతుల్ మేదినిన్॥

క॥ అనియాగతివ్రాసినశో। భనకాంచన ఫలకమళిక భా
గంబునస। య్యనగట్టించి నిజప్రియ। తనయుల వీక్షించిపల్కె దయవై
వారన్॥

గీ॥ తనయులారసవాశ్వంబు ధాత్రిదిరుగు। వేళనేవీరవరు
లాపి విడువకున్న। బలిమివిడిపించి సర్వేలమెలగజేసి। దెండఖండపరా
క్ర మాదిత్యులనగ॥

గీ॥ ఇవ్విధమునబల్కి యిలరేడుదీక్షతో। నుండెనంతసాగ
రోత్కరంబు। సప్తి వెనుకబోవ సమకట్టునెడతద్ధ। యంబు మాయమ
య్యె నద్భుతముగ॥

క॥ అనవినికథకుంగనుగొని। మునులిట్లనిరపుడుజన్న వృంద
త్తడిచే। కొనిమాయావిధినెవడరి। గనొ దెల్పుము మాకుసూత కీర్తి
సమేతా॥

ఉ॥ నావినిసూతుడిట్లనియె। నాకమునందలపాకవైరియో।
ధ్యావిభునందనుల్ ప్రబలులై దిగధీశులనోర్చి సర్వలో। కావళినేలజూతు
రకటా శకటార్యవతారమొందుగా। కీవసుధన్ జయింపగలరే యిలరేడు
లు నిర్జరౌఘములు॥

క॥ భువిగపిలాచార్యుడుహా। ర్యవతారము తద్ధ్రుగగ్ని కా
హుతులై బి। ట్టనయుదురని తలచియుసజ్జవనాశ్వము దొంగిలించి సాహ
సవృత్తిన్॥

చ॥ అరిగితపస్సమాధి జనితాయతసౌఖ్యము నొందుచున్న
యా। నరసునిజాంతికద్రుపున సంధిలజేసి పురందరుండుని। ర్జరపురికేగెన
మ్మఘతురంగము వోవుటగాంచితంద్రిక। త్తైరగెరిగించిరన్ మతతతింగని

యజ్ఞనాథుఁడిట్లనెన్।

ఉ॥ తేజియదృశ్యమాయెనని తెల్పఁగ నేటికిఁ బుత్రులారస! వ్యాజుఁడెవండొ యీమహితయజ్ఞము మాపఁగ నెంచి గైకొనెన్। వాజిని విష్టపత్రయ నివాసులనారసి దుష్టపాళితోఁ। నాజికిదారసిల్లి యెటులైన మఘాశ్వముదెండు పొండికన్॥

క॥ ఏమరితిమిసవనాశ్వము। నేమనుజాళినికృత్య మిది యగునోయిం। కేమార్గము దొరకకున్నన। కీమఘము నిరంతరాయ మెట్లగునొకదా॥

గీ॥ సవనమభిమంత్రితంబై ప్రశస్తమొందు। చుండెమనుమనితోఁదీక్షనుంటి నేను। తొలుత తెరగంటి వీడెక్కి కలయవెదకియవల మధ్యమలోకంబు నరసిపిదప॥

క॥ ఈజగతిన్ మీరొక్కొక। యోజనమాత్రముగ ద్రవ్వి యురగస్థలిఁబా। జీజాడదీసి జేకొని। రాజన దేదర్ప మూర రాసుతులార॥

క॥ అనిచక్రవర్తి నిజనం। దనులం బనుపంగ నాకనగరంబు నకున్। జననిశ్చయించివారువ। యనమైరి ధృతామితాయుధాటోప మునన్॥

సీ॥ కరవాలశూలముద్గరభిండివాలతోమరముఖాయుధపాళులిరులసీన। నలఘుపతాకరేఖాగ్రాంశుకాశుగావళులంబుధరకదంబములదోల। దోస్ఫాలనధ్వని స్తోమ్యంబుసింహనాదములజాండకరండతలముప్రీల్ప॥ చరణఘట్టితధరాచక్రనిర్యత్పాంసు నిచయంబు దెసలంది నింగి ప్రమింగ। నడిచిరమరాద్రి జేర జండతరపటహ। ధాంకృతినిరస్తదిగిభఘటావిశాల। కర్ణకోటరులగు తద్గ్రావకటక। పటలికెక్కిరి తన్మృగప్రతతిబర్వ॥

మ॥ గరుడవ్రాతముజెట్లబట్టె తొలుతన్గంధర్వ సంఘంబువే। గరిచెఱ ఘూసము గాటిపావలగుచున్ త్తొబారిరారుద్రులా। తురులై నిర్వ సుపాళులట్లు వసుపంక్తుల్వోయె నవ్వేళనా। గరులుద్యత్ప్రతి భా



ధ్యులై దివిజలోకంబెక్కు వార్తాశ్రుతిన్॥

క॥ సగరకుమారులు నిర్జర। నగరమునకు సవనవాహన నిమిత్తముబిట్టుగదాడివెట్టిరనివిని। దిగులుననిట్లని తలంచె దేవేంద్రుడెదన్॥

చ॥ సవహాయమేనుగొన్న కథసాగరులెట్టు లెఱింగిరోకదన్। జవమున వీరలిచ్చటికి సాగుదురే మదిగాంచకున్నబి। ట్టవియగ జొచ్చెడెందమహహా హరిశంకర వేధలైననే। డవమతిబొందరే ప్రకటితాహవదోహలులై యెదిర్చినన్॥

క॥ కడజన్నకర్జమునకున్। దడవినపనియేమి దేవతాపురిగపనుల్గడువడి నాకముస్సిన్। యెడరునకుం దొలగుటొప్పదే నాకనుచున్॥

సీ॥ దివ్యాంగయజ్వశూరవ్యూహములతోడ నప్సరస్సమితి బాయంగజేసి। చతురగ్రఘులను ధర్మశాక్వరంబునుదార్చినట్టిప్రాజ్ఞపనికాయములననిచి। సకలదానములిచ్చి శాశ్వతకీర్తిజేకొన్న వారల నల్వకొల్వుజేర్చి। వరసుధర్మాముఖ్య భవ్యవస్తూత్కరంబులన గోచరపు పట్టులనుమాటి। కలసిముప్పదమూడు కోటులనుసర్వ। లును జయంతుండు శచిరాగ ఘనహయుండు। డాగెనూర్ధ్వజగత్ప్రకాండముల గాండ। మునయనార్చుచు సాగరుల్దవిలిరేచి॥

చ॥ త్రిదివముఁజొచ్చియచ్చ ఖెవరింబాడగానక నద్దిరయ్యొయీ। పదముదొరంగి పోయిరొకో పాకవిరోధి మరుద్వయాధినుల్। కదనవిభీతులై యనుచు గాంచినుతించిరి తన్నికాయసం। పదలును వైజయంత ముఖమంగళ సౌధకళావిలాసముల్॥

మ॥ బలజంభ ప్రముఖక్షపాచరజయ వ్యాపారముత్తేడగోడలయందారసి వీరిశేఖరుడు వీడాప్రీడలేక్కిట్లుపీ। ధులకుంగన్పడ జేసెకల్లకథలస్తోక ప్రతాపంబుతో। దలపడ్డన్నతోడ నమ్ముదుము గోత్రద్వేషినంచాఁస్పుచున్॥

గీ॥ వేలుపులవీట నిల్లుల్లిల్లు వెదకివెదకి। కోటకొమ్మలనెగబా

క గోపురములు కెక్కి నందనవనిలోని జేగియరసి సవనధారాట మక్షి
గోచరముగాక॥

ఉ॥ మేరువుమీదనుండి పుడమింబడదూకగ రాజనందనుల్
ధారలునూరుగల్గు బెడిదంబగు కైదువుపిండిదాకిన। ట్లీరసగ్రుంగ భూ
భరపు టేనుగలుక్కరి మ్రొగ్గనిర్జరా। గారవు శృంగముల్గదలి కంపము
నొందె తదూర్ధ్వలోకముల్॥

సీ॥ ఉదయాద్రి మృగభయప్రదముగానార్చి యవ్వలబా
సిచని చక్రవాళమొరసి। దర్దురమలయగోత్రయమాలయములు గ్రద్ధ
నదాటి కడగట్టుదాకదిరిగి। తారస్తగిగ్రుంగ దత్కూటముల కెక్కి
తరువాత వలయ భూధరముగాంచి। ప్రాలేయసానుమద్రాజగుహాదే
శములు జొచ్చితుదనొప్పు మలకుబోయి। చివరకవధికుభృత్తుంగశృం
గపటలి దొరసితచ్చర మోగ్నాథ దుర్భరాంధ। కారమొక్కటదిలకిం
చికంపితాంగు। లగుచుగ్రమ్మరి సగరరాజాత్మభవులు॥

ఉ॥ జన్నపువార్వమెచ్చటికి జన్నదిగానక సర్వకుంభినీ।
భృన్నగికీవనుల్లెన్నవఁకి వేసటతో మనకత్తళానిజే। కొన్న దురాత్ముఁడుల్లి
దిను కోనుటిన్వైచె బలుకందట చుదా। రెన్నుచుగన్నవాని నలయింతు
రు ద్రుంతురుహేతిసంహతిన్॥

సీ॥ పల్లెలూరులు వనప్రతతులు పక్కనంబులుగట్లు కోన
లుకొలకుగములు। ప్రపలుకోటలు జప్పరాలు నుద్యానముల్సందులు
గొందులు సావడులును। మందుశాలలు సామజశాలలురురాజధా
నులు పేటముత్తములుపొదలు। మఠములువాగులు మరుగులుడొంక
లు బీళ్లుతీర్థోర్వ్యలు గుళ్లుగలయ। వెదకివెదకి సర్వవిశ్వంభరనుయజ్ఞ।
వీథిగానలేక భూతలాధి। పతికుమారులొక్క పట్టునజేరియా। కరణి
కొండొరులనుగాంచియనిరి॥

మ॥ హరిపాటచ్చరు డక్షిగోచరుగాడాహాధరిత్రీద్ధభిత్పూరి
నేనిన్ ధరనేనియుంకెచట నస్తోకోద్ధతింజూతము। త్తరిధారాటము గాన



కేళ్లు జనకుండర్శింపగా బోదము। దరమాభోగి జగత్ప్రదేశము గనన్
ఖాత్రిం బెగల్చన్‌దగున్॥

క॥ ధరద్రవ్వియురగలోకం। బరసిహరిందెందు జివరకనడే
మనభూ। వరుడదిమరువక యాగ। హ్వారిభవింతమని సగర వసుధేశ
సుతుల్॥

మ॥ శతకోటిప్రతిమోగ్రశూలవితతుల్ సాగుల్ఖనిత్రంబు
లుం। శితకుంతంబులు దోమ్మరప్రకరముల్ శీలాళికుద్దాళసం। తతులొ
క్కుమ్మడి దాల్చివారు సగదండంబూగ గర్జించిగ। ర్వితులై ద్రవ్వగసాగి
రుర్వరమహద్రింభోళి భీతిల్లగన్॥

ఉ॥ గట్టులబోలినట్టి పెనుగడ్డలు దీర్ఘపుగడ్డపారలన్। ద
ట్టిపెగల్చి పన్నపము దాల్చిన పోలికనొక్కటొక్కటిన్। బట్టితటంబు
పైకెగర బారగవైచుచు పర్వతాళిజూ। పట్టిననట్టిరొడ్డులకు పట్టుగలిం
చి కుభృత్కుమారకుల్॥

ఉ॥ లోతునడుల్గుమన్ను జనలోక పతిప్రియ నందనాఘ
మొం। తేతడవబ్బు పైతటికిదీయని దేలనటంచు గొబ్బునన్। వాతికిజేర్చి
మింగుచు జనంబునకొక్కని కొక్కయోజనం। బైతనరంగ ద్రవ్విరఖి
లావనినందరు చక్రవైఖరిన్॥

గీ॥ ఈకరణినాగలోకంబు దాకయోజ। నంబు లర్వదివేలు
భూనాథసుతులు। వసుధ బెగలింప ఫణిజగ ద్వాసులయిన। కాలకేయు
లు విస్మయాక్రాంతులగుచు॥

మ॥ ఉరగావాసమిదేడ భూమినరులోహో వచ్చియేనాడు
వ। చ్చిరిగర్వోద్ధతినిట్టులన్న నముపేక్షీభూత వృత్తిన్గృహా। త్కరము
ల్వాయక యున్న దారిగొని మర్త్యగ్రామణుల్ రారెయా। కరణింజు
ల్కనిమైలిమింక నమదోగ్రస్ఫూర్తిన్ దాకందగున్॥

క॥ అనితలచివారురణసా। ధనములుకంఖాణగజ రథంబుల
తోలా। కనికాయములర పెండ్లికి। జనుపగిదిం దరలిరుగ్ర సమరా

కాంతుఁ॥

ఉ॥ సాలకటంకటేయులు బిసప్రసవాసన దత్త సద్వరో। త్తాలతర స్వయాన్వితులు దారుణమూర్తులు కాలకేయులు। క్కాలము నందెనంగెను తెగల్ ద్వివిధంబుగనై యుగాంతపుం। గాలునికోరమీనముల కైవడిలోక భయంకరాకృతిఁ॥

క॥ ఇరుతెగల రక్కసులనా। గరులపయిన్న డుచువేళ గగనమునిండెఁ। బరుషతర పటహధ్వాంకృతి। చరణవినిర్దళిత భూమిచక్ర రజంబుఁ॥

మ॥ పటహధ్వానము లాలకించి వసుధాపాంసు చ్ఛటల్ గాంచిదివి। క్తలముల్ దుల్లెను గీతిజూచి సగరక్ష్మాజాని పుత్రాళులు। త్కటరోషంబున నుండఁబోరుంగని యహోకయ్యంబుగావింపని। చ్చటికే తెంచదరెవ్వరో బ్రతుకులెంచఁ లేవకోపీరికిఁ॥

క॥ అనిగజ్జిల్లుచుధాత్రిఁ। ఖననము సేయుటలువీడి గాఢప్రతిఘుఁ। గనుదమ్ములనింగలవుఁ। దునకల జడిగురియ నేర్పుతో వ్యూహవిధుల్॥

శా॥ శృంగారించుచు తోమరంబులు ఖరాశిశ్రేణులుంశూలముల్। సింగాణుల్ద్రోనలుంబరశ్వథ గదల్ ఖేటంబులుం బ్రాసముల్ రంగత్పట్టిసభిండివాలములు దుర్వారోద్ధతిం దాల్చిచో। రంగేళీగతి బాల్చిరారని రణారంభంబునంసాగరుల్॥

ఉ॥ అక్కడిరాక్షసప్రవరులందరు డాయగ వచ్చిధారుణిక్। ప్రక్కలుసేయజొచ్చితి రవార్యమదంబున నింతసేయమీ। రెక్కడివారలెందు కొరకిట్లొనరించితి రింకప్రాణము। ల్దక్కవు నిక్కమక్కట విధాత్రుడు మీకిటవ్రాసె పోభువిఁ॥

క॥ అనవినిరోషించిఘనా। ఘనగర్జానినదమున సగరనందనులి। ట్లనిరేముసాగరులమని। జనదావప్రావృడుగ్ర జలధరులమిలఁ॥

మ॥ పవకంఖాణము వోయొచోర హ్మృతమై సర్వంసహాఁ



దానికై। దివమున్నర్త్యము జూచికానక ధరిత్రిం ద్రవ్వి పాతాళపుం భువనంబారయ నుద్యమించితిమి మమ్ముం దాకి పోరాడలే। క మరుద్వల్లభుడేగె ఘోరపవిజంకన్నాటి నంత్రాసియై॥

క॥ కానంధరముమ్మేచం। దానఁ మారొక్కనిరణంబునం బ్రతుకగలా। రేనుంగల తోననికిఁ। బూనంగల వేశశౌఘములు ధైర్యమునఁ॥

ఉ॥ నావినియాతుధానులు జనప్రభుసూనుల గాంచియారర। శోవితతుల్న రాళిదిని తుుత్పరిపీడనడంతు రిప్పుడీ। కేవల శౌర్యమెట్లు జనకీటకపాళికి గల్గెనంచురో। పావిలమూర్తులైకదిసిరార్పులు నింగిబగుల్ప నొక్కటఁ॥

గీ॥ చటులసమితికిమార్కొను శత్రుసమితి। గాంచిపగరాత్ర జులుకరోగ్రతరమండ। లాగ్రముఖ్యాయుధములు దళముగగాఱు। జీకటుల నినదాకిరస్తోకపటిమ॥

ఉ॥ అయ్యిరువాగువారలు నిజాంఘ్రిచయోగ్రత భూపరాగము। ల్గయ్యపులచ్చికుల్లెడలు గాగనుపట్టకరాయుధాంశువు। ల్వయ్యరతండ్రి పైకెగసి పంకజబాంధవ భానుకోటితో। వియ్యాను సేయ బోరి రరవిందభవాదులకుఁ భయంబుగఁ॥

మ॥ కలనఁ శూలగదాధనుర్నికరముల్ ఖడ్గంబులుంజూర్ణమై। బాలియందారుభుజాభుజిందొడరి నిర్మూలంబుగాబోరుచో। గలిగెన్ గీకసపాంసుసైకతశతల్ క్రవ్యోరుపంకల్సము। జ్వలివచ్ఛత్ర సితాంబుజల్కనదసృక్స్రాపగల్ తద్రసఁ॥

ఉ॥ సాగరులుగ్రకోప విలసన్నయ నారుణదీధితుల్దిశా। భోగవతీకుచంబులను బూసినకుంకుమ రేఖలైతెగఁ। తేగల కుత్తుకల్నరికి తీవ్రపుటీటుల రొమ్ములూడ్చినఁ। వేగమ కాలకేయకుల వీరులుకొందరు వారిరార్తులై॥

గీ॥ బలసిసాలకటంకటేయులును కాల। కేయులొక్క కొం

దరతిరుషాకీలితాత్ము । లగుచు సాగరులనుదాకియానమీక । ధాత్రిగం
పింపబోరిరిసతుణంబ ॥

గీ॥ ఈషగిదివిరిరిశేషంబుగా పలాయ । నంబెనంగివిపంథిగ
ణాంబునోవ । కలహరంగంబునందు సాగరులుధూమ। కీలికణములు నా
వెలింగిరిజలంగి॥

గీ॥ శత్రుకోటిదొలగిచనిన సర్వదివేల । యోజనములు త్ర
వ్వియాజగతిని । గానమైతిమిచట కంఖాణమిక రేని । కేయుక జేసికర్జ మె
రుగవలదె ॥

క॥ అనిసాగరులందరుజన । కునిపాలికి బోయిమేము కువల
యమెల్లన్ । గనినారముదుష్కరము । గొంచనుచోరుండు దొరుకకుని
కి గలుగుచున్॥

చ॥ అరువదివేలయోజనము లద్భుతవృత్తిధరిత్రిద్రవ్వభీ । క
రులగు రాక్షసావళుల గయ్యమునుమాకులభించెనంతన । య్యురులపరా
భవించితి మహాంకృతి హార్యపహారిజిక్కలే । దరుదిదిగాదె సెల్వొనగు
మాతుది కర్జమిలాబలాహితా॥

మ॥ పరణింగాంచిన సిద్ధపన్నగ మరుత్సాధ్యాసురశ్రేణిగా।
పరదుష్కరపురంబులోనికరుగన్ శౌర్యంబునం బేర్చిభీ । కరభంగిన్
త్రిదివంబు జేరు నెడలేఖస్వామి ఘోరాత్ముడై। బర చెన్ ముప్పదిమూడు
కోటుల సుపర్వవ్రాతముల్మున్నగన్ ॥

క॥ రవిచంద్రకిరణజాలము । లవనీస్థలి నెంతదూర మానుత
దుర్వి। జ్జవమున నన్వేషించియు । భువిద్రవ్వితిమింక నెల్లు బోవలయు
నృపా ॥

క॥ అనవినిగనలిమహీవిభు । డనియెన్ సుతులార నత్రహ
యచోరకుగాం । చనిపనిచేబడలితిమని । వినిపించితిరహా మే వివేకుల
కువినన్ ॥

క॥ ఎచ్చోటనేనిముచ్చున్ । ద్రవ్చిహరిందెచ్చి యధ్వర



ముగడతేర్పన్ । వచ్చుటవచ్చుటయూరకె । వచ్చుటగని మిమ్ముమెచ్చ
వచ్చునెనాకున్ ॥

గీ॥ మానవేశ్వరుడిట్లాడ మగుడిసగర । విభు సుతులుదా
ము త్రవ్వినవివరసీమ। జొచ్చిచనుచుండిరన సూతుజూచి శౌన। కాదు
లవ్వలికథ దెల్పుమనియనుటయు॥

మ॥ కలుషోర్వీధరశంబశంబరద కంఖాణాది యజ్ఞాశిహృ ।
జ్జలజాతారుణబింబబింబఫల భుగ్గారాట చైత్రేంద్రని । ర్మలినచ్ఛవ్య
వలంబలంబ కరధర్మక్రూర పత్రిచ్ఛటా । చలితోగ్రాసుర డింబడింబ భ
వరాజ్య శ్రీవిభుస్యందనా ॥

క॥ గోత్రాంబుజాల యాధిపగోత్రావన కారణోద్ధగోత్రోద్ధ
రణా । గోత్రస్మృతి మాత్రనుధీ । గోత్రపవిత్రప్రచారి కుమతవిదారి॥

భుజంగప్రయాతము ॥ సుధాధామ శేషాబ్జ శోభాచ్ఛకీర్తీ । బుధాపద్ధ
వేంధాన భూర్యభ్రమూర్తీ । కథాధూతభక్త ప్రకాండాఖిలార్తీ ।
విధూమాగ్నికీలా భవిక్రాంతవర్తీ ॥

గద్య ॥ ఇది శ్రీమద్దక్షిణామూర్త్యష్టమూర్తీ దాక్షిణ్యానులబ్ధ
కవితా సారశౌనక గోత్రారామపటీర సుభద్రాంబికా
పిచ్చయామాత్యకుమార తురగాన్వయ పయస్సాగ
రాభోగ తారాజార వేంకటకవిధీర ప్రణీతంబైన
నిర్వచన భగీరథోపాఖ్యానంబను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము॥

